THE ANDHRA PATRIKA. MADRAS.

6 పేజీలు వెల 1 అణా. హాఫీ 0-1-2.

రాష్ట్రీ బడ్జెట్ పై అసెంబ్లీ చర్చ సమాప్తి: విమర్శలకు ఆర్థికమంత్రి సమాధానం —6 వ పేజీ

# ఆంధ్రపత్రిక

ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేక హైకోర్టు వుండాలని ప్రధానికి న్యాయవాదుల విజ్ఞప్తి —4 వ పేజీ

318499

Regd. No. M. 1118 సంపుటం 39. సంచిక 347 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. సోమవారము 23-3-1953

# పరస్పర సంప్రదింపులే కార్మిక తగాదాల పరిష్కారానికి ఉత్తమం

## "ఆవేశాలకు లోనుగాకుండా ప్రశాంతంగా విభజన జరుపుకోండి"

### ఆంధ్రులకు గవర్నరు సలహా

### కాకినాడ పురపాలకసంఘ స్వాగతమునకు శ్రీ ప్రకాశ సమాధానం

కాకినాడ, మార్చి 22: "ఆవేశాలను, పరస్పర నిందారోపణలను కట్టిపెట్టి, యితరుల మనస్సు నొప్పించకుండా, ప్రశాంత వాతావరణంలో విభజన జరుపుకోండి" అని మదరాసు రాష్ట్రీ గవర్నరు శ్రీ ప్రకాశ, గతసాయంకాలం, స్థానిక పురపాలక సంఘంవారి స్వాగతమునకు సమాధానం చెబుతూ, ఆంధ్రులకు సలహా యిచ్చారు.

ఆంధ్రులు, గొప్పజాతి అని, గతంలోవలె భవిష్యత్తులో కూడా వారికి ఉజ్వల భవిష్యత్తు ఉన్నదని, శ్రీ ప్రకాశ అన్నారు.

పురపాలక సంఘంవారు గవర్నరు శ్రీ ప్రకాశగారికి సమర్పించిన స్వాగతపత్రంలో, రానున్న ఆంధ్రరాష్ట్రమందు, ప్రభుత్వోద్యోగా లన్నింటిలోనూ, ఆంధ్రులనే నియమించాలని, ఆంధ్రరాష్ట్రంలోను, అవశిష్ట మద్రాసురాష్ట్రంలోనూ, అల్పసంఖ్యాకులకు తగిన రక్షణలు కల్పించాలని అర్థించారు.

కృష్ణా ఆనకట్ట మరమ్మతులను శీఘ్రంగా పూర్తి చేయించాలని కోరారు.

కాకినాడలో, పేద, మధ్యతరగతి ప్రజలు, ఆహార ధాన్యాలు హెచ్చు ధరలు పెట్టి కొనుక్కోలేక బాధపడుతున్నారని, తూర్పుగోదావరి జిల్లా నుంచి ధాన్యం ఎగుమతులు నిలిపి వేసి, ధాన్యం ధరలపై కంట్రోలు పెట్టి, చౌక డిపోలద్వారా ప్రజలకు ఆహారధాన్యాలను సరఫరా చేయాలని కోరారు.

యుద్ధం ముగిసినది ఆగాయుతూ కాకినాడ రేవు విషయం ప్రభుత్వం నిర్లక్ష్యంగా చూస్తోందని, వ్యాపారం దెబ్బతిని కార్మికజనంలో, నిరుద్యోగం ప్రబలిందనీ ఈ రేవును అభివృద్ధి చేయాలని, మెయిన్ రైల్వేలైను, యీ పట్టణంమీదుగా మరల్చి, వర్తక వాణి...

(2 వ పేజీ చూడుడు)

### రాష్ట్రపతి బస్తర్ పర్యటన

జగ్దల్పూర్, మార్చి 23 : గవర్నరు డా॥ పట్టాభి సీతారామయ్య, ముఖ్యమంత్రి పండిట్ రవిశంకర్ శుక్లగారలతో అధ్యక్షుడు రాజేంద్ర ప్రసాద్ ఈ ఉదయం రాయపూర్ నుంచి విమానంమీద యిక్కడికి వచ్చారు. రాజేంద్ర ప్రసాద్‌గారు బస్తర్ జిల్లాలో 3 రోజులు పర్యటన చేస్తున్నారు. జగ్దల్పూర్ విమానాశ్రయంలో డా॥ రాజేంద్ర ప్రసాద్‌కు ఉత్తర దక్షిణ బస్తర్‌ల కొండజాతులకు చెందిన బాలబాలికలు పూలమాలలు వేశారు.

అధ్యక్షుడు రేపు చిత్రకోట జలపాతాన్ని కమ్యూనిటీ ప్రాజెక్టును సందర్శిస్తారు.

## హైదరాబాదు రైల్వేపనివారలసంఘ రజతోత్సవ సభలో గిరిగారి ఉద్బోధ

### శ్రామిక జనశ్రేయస్సును కాంక్షించే సమాజ వ్యవస్థ ఏర్పడక తప్పదని ప్రకటన

హైద్రాబాదు, మార్చి 22: కార్మికులు నూటికి నూరువంతులు ఆర్థిక విముక్తి లభించే సిద్ధాంతం ఆధారంగా జేసుకని నేడు కాకపోతే అద్యతన భవిష్యత్తులోనైనా ఇండియాలో సమాజ వ్యవస్థ నిర్మించబడక తప్పదని ఇండియా కార్మికమంత్రి వి. వి. గిరిగారు స్థానిక రైల్వేపనివారలసంఘం రజతోత్సవంలో ప్రసంగిస్తూ అన్నారు.

సికింద్రాబాదులోని రైల్వే పనివారల సంఘ కార్యాలయావరణలో ఈ ఉత్సవాలను ప్రారంభిస్తూ కేంద్ర కార్మికమంత్రి శ్రీ వి. వి. గిరి ఇంకా యిలా అన్నారు :

"పనివారలు బలవత్తరమైన సమైక్య కార్మికోద్యమం నెలకొల్పితే నేగాని వారి స్థితిగతులు బాగుపడవు. కార్మికులు సమష్టి ఉద్యమంద్వారా తమ కోరికలు న్యాయమైనవని నిరూపించు...

"ఎక్కువ వేతనా లివ్వమని మీరు ప్రభుత్వాన్ని గాని, లేదా మీ యజమానులను గాని కోరినప్పుడు మీ యజమానులను మీరెలా చూస్తున్నారని అడిగే హక్కు వారికున్నది."

సాంకేతిక నిపుణులను, లెక్కల వివరాలు బాగా తెలిసినవారిని మీరు మీ సంఘాలలో కార్యకర్తలుగా నియమించాలి. పారిశ్రామిక కార్మిక వ్యవహారాలు తెలిసినవారి మీ సంఘాలలో కార్యకర్తలుగా నియమించాలి. ఒక పారిశ్రామిక వివాదం వచ్చే ప్రమాదం కనిపించినప్పుడు కార్మిక సంఘాలలోని సాంకేతికనిపుణులు, లెక్కలు తెలిసినవారు సమాలోచనలు జరిపి కార్మికుల కోరికలు ఎలా వుండవలసిందీ నిర్ణయించాలి.

"అహమ్మదాబాద్ గుడ్డల మిల్లులలోని కార్మికసంఘాల వ్యవహారం చూడండి. ఈ నాడు ఇండియాలో ఇతర ప్రాంతాలలోని కార్మికులకంటే వారెక్కువ వేతనాలు సంపాదిస్తున్నారంటే మహాత్ముని నాయకత్వాన అక్కడి కార్మికసంఘాలు సాంకేతికంగా తమ సంఘాలను పటిష్టం చేసుకోవడమే ప్రధాన కారణం. అక్కడి కార్మికులు తమయజమానులతో సంప్రదింపులు జరిపి వివాదాలు పరిష్కరించుకొంటున్నారు.

"సమ్మె కడపటి ఆయుధం అనే గింజవలసిన కడపటి ఆయుధమని నా అభిప్రాయం. గతంలోనూ అంతే, ఇప్పుడూ అంతే.

"సమ్మె కడపటి ఆయుధం అనే నివాదానికి మధ్యవర్తిత్వం కూడా ఆఖరుపద్ధతి అనే వివాదం ఇప్పుడు కలుపుతున్నాను. వివాదపరిష్కారానికి ఇతర పద్ధతులన్నీ విఫలమైతే నే యీ రెండు పద్ధతులు అవలంబించాలి.

"నా యీ మాటలను అనేకమంది స్నేహితులు అపార్థం చేసుకోవచ్చు. మధ్యవర్తి నిర్ణయాలు బలవంతాన అమలు జరిపే బదులు సంప్రదింపుల ద్వారా వివాదాలు పరిష్కరించుకోవాలనే నా యీ మాటల తాత్పర్యం. యజమానులకు కార్మికులకు వచ్చే వివాదాలను పారిశ్రామిక స్థాయిలో పరిష్క...

(3-వ పేజీ చూడుడు)

### సమితి ప్రధాన కార్యదర్శి పదవి

#### విజయలక్ష్మి పేరు ప్రతిపాదన జరిగిన వైనం

ఐక్యరాజ్య కార్యాలయం, మార్చి 21: ఐక్యరాజ్యసమితి కార్యదర్శిపదవికి ఎవరిని నియమించాలి అనే విషయం చర్చించడానికి భద్రతా మండలిలోని శాశ్వతసభ్యులయిదుగురు సోమవారం నాడు మళ్లీ సమావేశం అవుతారు. శాశ్వత సభ్యులకు ఈ విషయమై యింతలో సమాధానం కుదిరే సూచనలు ఏమీ కన్పించడంలేదు. క్రిందటి సమావేశంలో విజయలక్ష్మి పండిట్ పేరును...

## పరిపూర్ణత్వం పొంది ఆంధ్రరాష్ట్రం వర్ధిల్లాలి

### కౌన్సిలులో రాజాజీ ఆశీర్వాదం

మదరాసు, మార్చి 22 : ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి నిన్న కవున్సిల్లో బడ్జటు చర్చకు సమాధానం ఇస్తూ ఉపనిషత్ వాక్యములతో ఆంధ్రరాష్ట్రమును, శేషించినరాష్ట్రము వర్ధిల్లవలెనని ఆశీర్వదించారు.

"శ్రీ డి. వెంకటరావు, శ్రీమతి సీతామహాలక్ష్మమ్మ గార్లు ఆంధ్రరాష్ట్రం విషయంలో నేను చేస్తున్న తప్పులనుగురించి చెప్పారు. నేను చెప్పవలసింది స్పష్టంగ చెప్పివున్నాను. మరల ఎన్నిసార్లు చెప్పినా అపోహలను తొలగించలేననుకుంటున్నాను. అసాధ్యమైనపనికి పూనుకొనుట మంచిది కాదు. శ్రీ వెంకట్రావుగారు విశాలభావాలు గలవారైనా వారు నన్ను అర్థం చేసుకోలేదు. అయినా ఆంధ్రరాష్ట్రమును ఆశీర్వదించ వుంటున్నారు. ఇంకా నాయందు నా ఆశీర్వచనముయందు గౌరవం వుందా ? అయితే మహాబుషులు పూర్వం ఈ క్రిందిమాటల్లో చెప్పింది ఈ నాటికీ వర్తిస్తుంది. అందులోని భావాలు నిజమగుగాక.

"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే,
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే."

అంటే పాతరాష్ట్రమునుండి నూతన రాష్ట్రం ఏర్పడబోతున్నది. నూతన రాష్ట్రం, శేషించిన రాష్ట్రంకూడా పూర్ణముగ వుండాలని నా ఉద్దేశ్యం. అంతా శాంతంగ వుండుగాక అని అన్నారు.

ఆంధ్రరాష్ట్రము గురించి తన వైఖరిని వివరిస్తూ ముఖ్యమంత్రి ఇంకా ఇల్లా చెప్పారు. "ఈ విషయంలో అపోహలుకలుగుటకు అవకాశాలు వు...

(3 వ పేజీ చూడుడు)

## ఆయుధ విసర్జన సంఘ నివేదికపై 14 రాజ్యాల తీర్మానం

### రాజకీయసంఘం ఆమోదం: ఇండియాతో బాటు ఐదు దేశాల తాటస్థ్యం

ఐక్యరాజ్య కార్యాలయం, మార్చి 21: ఆయుధ విసర్జన సంఘం సమర్పించిన నివేదికను ఆమోదించి, ఆ సంఘాన్ని చర్చలు కొనసాగించవలసిందిగా కోరుతూనూ, మళ్లీ సెప్టెంబరు 1 వ తేదీలోగా యింకో నివేదికను సమర్పించవలసిందని సూచిస్తూ, అమెరికా బ్రిటన్ మొదలుగాగల పధ్నాలుగు దేశాలు దాఖలుచేసిన తీర్మానాన్ని రాజకీయ కమిటీ ఈ వేళ ఆమోదించింది. తీర్మానానికనుకూలంగా యాభై, ప్రతికూలంగా అయిదూ వోట్లు వచ్చాయి. అఫ్ఘానిస్థాన్, బర్మా, ఇండొనేసియా, ఇండియా, సౌదీ అరేబియా ఈ అయిదు దేశాలూ తాటస్థ్యం వహించాయి.

...కూల్చివేయగా, అధ్యక్షుడు ఐసెన్ హోవర్, "ఈ సంఘటనను బట్టి అంతర్జాతీయ పరిస్థితి విషమించినట్లు భావించరాదనీ, ఈ సంఘటనలన్నీ బుద్ధిపూర్వకంగా కాక ప్రమాదవశాన జరిగినవి అని తన అభిప్రాయమనీ" వ్యాఖ్యానించారు. ఇరుపక్షాలవారు చేస్తున్న ప్రకటనలనుబట్టి, కొరియా మొదలైన ప్రాంతాలలో యుద్ధం త్వరలో ముగింపుకు రాగలదని ఆశిస్తున్నాననీ, ఆయుధవిసర్జన సంఘాన్ని రద్దు చేయాలని...

### జెకొస్లొవాకియా కొత్త అధ్యక్షుడు

#### అంటోనిన్ జపొటోకీ ఎన్నిక

వియన్నా, మార్చి 21 : గొట్వాల్డ్ స్థానే జెకొస్లొవాకియా అధ్యక్షుడుగా అంటోనిన్ జపొటోకీ ఎన్నిక అయినాడు. జెకొస్లొవాకియా నేషనల్ అసెంబ్లీ ఏకగ్రీవంగా ఆయనను ఆ పదవికి ఎన్నుకొన్నట్లు ప్రాగ్ రేడియో ప్రకటించింది.

## 'పంచవర్ష ప్రణాళికలో తరుగువచ్చే 300 కోట్లను అమెరికా ఇవ్వాలి'

### రాయబారి పదవినుంచి విరమిస్తున్న చెస్టర్ బౌల్స్ ఉద్బోధ

న్యూఢిల్లీ, మార్చి 21: భారతప్రభుత్వ పంచవర్షప్రణాళికను అమలుచేయడానికి తరుగుపడే 300 కోట్ల రూపాయిల ద్రవ్యమును అమెరికా షరతులేమీ లేకుండా యివ్వాలని ఉద్యోగమునుండి విరమించుకుంటున్న అమెరికా రాయబారి ఛెస్టర్ బౌల్సు నేడు యిక్కడ సూచించారు.

అమెరికా ఇదివరలో చేసిన ద్రవ్యసహాయమును భారతదేశము 'ధైర్యంగా ఉపజ్ఞతతో అత్యంత ప్రయోజనకర మయ్యే విధమున' ఉపయోగించుకొంటున్నదనే గాఢ విశ్వాసమును ఛెస్టర్‌బౌల్సు వెల్లడించారు.

భారతదేశమునుండి వెళ్లిపోయే అవసరమున ప్రకో్న తిరరూపమున ఒక ప్రకటన చేస్తూ చెస్టర్ బౌల్సు యిలా చెప్పుతున్నారు :

"అమెరికా భారతదేశానికి గోధుమ ఋణంరూపమున 19 కోట్ల డాలర్ల ఋణంకాక, 9 కోట్ల 50 లక్షలడాలర్లు యిచ్చింది. ఈ ద్రవ్యంచాలుతుందని నేనుతలచను. పంచవర్ష ప్రణాళికను అమలు చేయడానికి 60 కోట్ల డాలర్ల నుండి 70 కోట్ల డాలర్లవరకు అనగా 300 కోట్లరూపాయలపై తరుగుపడుతుంది. ...

పంచవర్షప్రణాళిక విజయానికి అత్యవసరమైన ద్రవ్యమును యిచ్చి భారతదేశం ధైర్యంగా చేస్తున్నకృషికి అమెరికా దోహదంయివ్వాలని నేను విశ్వసిస్తున్నాను. ... అమెరికా యీ ద్రవ్యసహాయం చేయాలి. ఆసియాలో...

(3 వ పేజీ చూడుడు)

### టర్కీలో భూకంపం

ఇస్తాన్బుల్, మార్చి, 21 : టర్కీలో క్రిందటి బుధవారంనాడూ, మళ్లీ నిన్న రాత్రీ తీవ్రమైన భూకంపాలు వచ్చి, మార్మరా కోస్తా ప్రాంతం యావత్తు శిథిలమైపోయింది. మరణించిన జనసంఖ్య 200,కు మించి 500 లోపు వుంటుందని అంచనా వేయబడింది. యెనిస్, గలన్, బలూక్, ఎస్నెక్, కనక్, కాలె పట్టణాలలో వున్న ఇళ్లు నూటికి 90 కి పైగా కూలిపోయాయి. ఆదివారం మళ్ళీ భూకంపం రావచ్చునని భయపడుతున్నారు.

### రావల్పిండిలో కర్ఫ్యూ

లాహోర్, మార్చి 22 : రావల్పిండిలో కర్ఫ్యూ ఉత్తర్వు నేటినుంచి రాత్రి 10 గంటల మొదలు తెల్లవారి 4 గంటలవరకు అమలు జరుపబడుతుంది. నిన్నటిదాకా ఈ ఉత్తర్వు రాత్రి 8 గంటల మొదలు 5 గంటలవరకు అమలు జరపబడుతూ వచ్చింది.

## పట్టుదల ప్రదర్శిస్తే ప్రజాస్వామ్య రాజ్యాలు కమ్యూనిస్టు దురాక్రమణను అరికట్టగలవని వన్ ఫ్లీట్

గైన్స్‌విల్, మార్చి 21: "ప్రజాస్వామ్య దేశాలు పట్టుదలతో ధైర్యంతో కార్యాచరణకు పూనుకొన్నట్లయితే, కమ్యూనిస్టు దురాక్రమణను అరికట్టటం అంత కష్టం ఏమీకాదు. కొరియా మొదలైన ప్రాంతాలలో మిలిటరీ విజయాన్ని సాధించటం సులభమేనని నా అభిప్రాయం. ప్రజాస్వామ్య దేశాల ఈ ప్రతిఘటన తృతీయ ప్రపంచ సంగ్రామానికి దారితీయదని గూడా నా విశ్వాసం" అని కొరియాలోని మాజీ అష్టమసేనాని వాన్‌ఫ్లీట్ ఈ వేళ ఫ్లారిడా విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం చేస్తూ అన్నారు.

అధ్యక్షుడు ఐసెన్ హోవర్‌తో మిలిటరీ వ్యవహారాలను గురించి తాను చర్చలు జరపదలచినట్లు మాంట్ గొమరీ ప్రకటించాడు.

అమెరికాలోని మిలిటరీ నాకా, విమానాశ్రయాలను సందర్శించబోతున్నాననీ, అమెరికా కెనడాలరక్షణ శాఖాధికారులతో కూడా చర్చలు జరుపుతాననీ ఆయన తెలియజేశారు. ఏప్రిల్ మాసాంతానికి ఆయన స్వదేశానికి తిరిగి వస్తారు.

### అమెరికాకు మాంట్ గోమరీ ప్రయాణం

యూరప్‌లోని మిత్రరాజ్య సహాయ సర్వసేనాని ఫీల్డ్ మార్షల్ మాంట్ గోమరీ అధ్యక్షుడు ఐసెన్ హోవర్ తోను అమెరికా కెనడాల రక్షణ శాఖాధికారుల తోను సంప్రదింపులు జరిపే నిమిత్తం ఈ వేళ నౌకమీద న్యూయార్కు పయనమయారు.

### బాన్ డాయ్‌తో జనరల్ మార్క్ క్లార్కు సంభాషణ

సియిగాన్, మార్చి 20: కొరియా జపానులలో సమితి సర్వసేనాపతి అయిన జనరల్ మార్క్ క్లార్కు నేడు వైట్‌నామ్ ప్రధాన సైనికాధికారి అయిన చక్రవర్తి బావ్ డాయ్‌ని కలుసుకొని 25 నిమిషాలు మైత్రీభావమున సంభాషణలు జరిపారు. తరువాత ఆయన సైనికాధికారుల శిక్షణ పాఠశాలలను దర్శించారు.

## కాంగ్రెస్‌తో సహకార సమస్యపై కృపిక్ పార్టీ కార్యవర్గం చర్చ

### నెహ్రూతో తమ సంప్రతింపులపై సభ్యులకు రంగాగారి వివరణ

మదరాసు, మార్చి 22 : ఆంధ్రరైతు కూలి ప్రజాపార్టీ కార్యవర్గము, కృషికలోక్ లెజిస్లేచర్ పార్టీ సభ్యులునిన్న సాయంత్రం పీటర్సు రోడ్‌లోని "సుందర్ మహల్"లో సమావేశమై ఆంధ్ర కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీవారి తీర్మానం ననుసరించి వారితో సహకరించే విషయమై చర్చించారు. సభకు శ్రీ గౌతులచ్చన్న యం. యల్. ఏ. గారు అధ్యక్షత వహించారు.

రాకొండ లక్ష్మీనరసింహంగార్లతో వివిధ గ్రూపుల మధ్య సమాకారం సాధించే విషయమై చర్చలు జరిపినట్లు తెలుస్తున్నది.

శ్రీ సంజీవరెడ్డిగారు నిన్న రాత్రి అనంతపురం వెళ్లేముందు ప్రజా సోషలిస్టునాయకుడు శ్రీ ప్రకాశంపంతులు గార్ని మరల కలుసుకొని సంప్రదించినట్లు తెలుస్తున్నది. ప్రకాశంపంతులు గారు ఇవ్వాళ బయలుదేరి ప్రజా సోషలిస్టు కార్యకర్తలలో ...

శ్రీ సంజీవరెడ్డిగారు అనంతపురంనుండి తిరిగివచ్చి 24 తేదీన జరిగే కాంగ్రెసుపార్టీ సమావేశమునకు తాను ఇంతవరకు వివిధ ప్రజాస్వామ్య పక్షాలతోను గ్రూపులతోను వ్యక్తులతోను సాగించిన సంప్రతింపుల గురించి సభ్యులకు వివరపరచి భవిష్యత్ కార్యక్రమం నిర్ణయించగలరని తెలుస్తున్నది.

ఆంధ్రా కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ తీర్మానమును ననుసరించి సహకరించే విషయము కూడ కొంతవరకు చర్చ జరిగింది. ఈ విషయమై మరల ఇవ్వాళ సమావేశమై చర్చిస్తారు.

జిల్లాబోర్డు ఎన్నికలను వీలుంటే వెంటనే జరపాలని ... ఎన్నికలు జరిగే వరకు బోర్డు పరిపాలనను స్పెషల్ ఆఫీసర్లకు వప్పగించాలని కోరుతూ ఒక తీర్మానం చేశారు.

ఆంధ్రకాంగ్రెసు లెజిస్లేచర్ పార్టీ నాయకుడు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు నిన్న శ్రీ వై. ఆదినారాయణ రెడ్డి, ...

## లేనిగ్రామాలలో పంచాయతీల ఏర్పాటు: మంత్రిప్రకటన

మదరాసు, మార్చి 21: స్థానికపాలన మంత్రి శ్రీ శంకరరెడ్డిగారు ఇవ్వాళ అసెంబ్లీలో గ్రామ పంచాయితీల చట్టము ననుసరించి పంచాయితీలు లేని గ్రామాలలో పంచాయితీలను ఏర్పాటుచేసే విషయం ప్రస్తుతపు పంచాయితీ ఎన్నికలు ముగిసిన తరువాత పరిశీలించబడుతుందని శ్రీ కె. ఆర్. విశ్వనాథంకు తెలియజేశారు.

శ్రీ వెంకటనారాయణప్ప ప్రశ్నకు సమాధానం ఇస్తూ ఆంధ్రరాష్ట్రం ... పంచాయతీ ఎన్నికలు వాయిదాపడవనికూడ మంత్రిగారు తెలియజేశారు.

# క్రీడారంగం

### జమైకా-భారతజట్ల పోటీ

కింగ్స్టన్ ఓస్, మార్చి 21: ఇవాళ ఆటముగిసే వేళకు జమైకా జట్టు మూడు వికెట్లు నష్టానికి 42 పరుగులు చేసింది. జమైకా మొదటి ఇన్నింగ్సులో 194 పరుగులు చేసే భారతీయ జట్టు 139 పరుగులు మాత్రమే చేయ గల్గింది. ఈ మొదటి ఇన్నింగ్సులో మంత్రేకర్ 49 పరుగులు చేశారు ఉమ్రిగర్ 18, రామచంద్ 15 పరుగులు మాత్రం చేశారు.

### రంజీట్రోఫీ క్రికెట్

కలకత్తా, మార్చి 21: ఇవాళ ఆట ముగిసే వేళకు హోల్కార్ జట్టు ఒక వికెటు నష్టానికి 34 పరుగులు చేసింది. బెంగాల్ జట్టు మొదటి ఇన్నింగ్సులో 479 పరుగులు చేసింది. పి. బి. దత్ 141 పరుగులు చేశారు.

### అఖిలభారత ఫుట్‌బాల్ పోటీ

అలెప్పీ, మార్చి 21: బెంగుళూరు బ్లూస్ జట్టు, కొట్టాయం హెచ్. యం. పి. జట్టు ఈరోజు తిరిగి ఆడిన ఆట కూడా డ్రా అయింది. బెంగుళూరు, కొట్టాయం జట్లు, ఒక్కొక్క గోలు మాత్రం చేశారు.

### శ్రీరామవర్మ ఫుట్‌బాల్ టూర్నమెంటు

ఎర్నాకులం, మార్చి 21: మైసూరు 516 కమాండ్ వర్కుషాపు జట్టుకూ మైసూరు ముస్లిం జట్టుకూ జరిగిన ఫుట్‌బాల్ మాచి ఎటూ తేలలేదు. రెండు జట్లూ చెరి రెండు గోల్సు చేశారు.

# రేడియో

### మంగళవారం మార్చి 24వ తేదీ

**విజయవాడ**

ఉ॥ 7 తెలుగున వార్తలు, 7-15 మద్రాసు (బి) వలె, 7-30 మద్రాసు వలె, 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 1 మద్రాసు (ఎ) వలె, 1-40 హిందీలో వార్తలు, 1-50 తెలుగున వార్తలు, 4 గానసుధ (రి).

సా॥ 5-30 ఎస్. బాలాంబ, 5-50 అంబటిపూడి శ్రీరామమూర్తి: వయొలిన్, 6-10 స్థానిక ప్రకటనలు, వాతావరణం, 6-15 సంగీతశిక్షణ, 6-30 గ్రామస్థుల కార్యక్రమం, 7 తెలుగున వార్తలు, 7-15 గ్రామస్థుల కార్యక్రమం, 7-30 గీతమంజరి (రి), 7-45 వాద్యబృందము, 8 ఎస్. బాలాంబ (గాత్రం), 8-30 అంబటిపూడి శ్రీరామమూర్తి: వయొలిన్, 9 ఆంగ్లమున వార్తలు, 9-15 విశ్వవిద్యాలయాల కార్యక్రమం.

**మద్రాసు (ఎ)**

ఉ॥ 7 స్వాగతం, 7-15 తమిళమున వార్తలు, 7-30 కోలేటి వెంకటేశ్వర్లు (గాత్రం), 8 ఆంగ్లమున వార్తలు.

మ॥ 12-30 వాద్యమ్యూజిక్ (గాత్రం), 1 మహిళామండలి 1-30 గీతమంజరి (రి), 1-40 హిందీలో వార్తలు, 1-50 గానమంజరి (రి), 2 తమిళమున వార్తలు, 2-10 మద్రాసు (బి) వలె, 4-30 పాశ్చాత్య సంగీతం.

సా॥ 5-30 హరిహరసుబ్రహ్మణ్య శాస్త్రి గాత్రం, హరి అచ్యుతరామశాస్త్రి వయొలిన్ 6 ఆంగ్లమున వార్తలు స్థానిక ప్రకటనలు వాతావరణం వాణిజ్య వా॥ (ఆంగ్లం) 6-15 సి. ఎస్. రాజరత్నం (గాత్రం) 7 చిత్రబలనరవంజి (రి) 7-15 తమిళమున వా॥ 7-30 సంచాందు బిట్టం సమూహసలన్ (తమిళప్రసంగం) 7-45 ఆలత్తూర్ సోదరులు 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీనాటకము, (తమిళం) 9-30 మెక్సికోలో ఒక ప్రయోగం (ఆంగ్లం) 10 వాద్యసంగీతం (రి).

**మద్రాసు (బి)**

ఉ॥ తెలుగున వా॥ 7-45 ఉదయగానం (రి) 7-30 మద్రాసు (ఎ) వలె.

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మద్రాసు (ఎ) వలె 1 మహారాజపురం విశ్వనాథ అయ్యర్ 1-30 ఆంగ్లమున వా॥ 1-40 గీతమంజరి (రి) 1-50 తెలుగున వా॥ 2 నిలయ విద్వాంసులు 2-15 ఎన్. రవీంద్రన్ వీణ 4 ఎ. ఎల్. సుగుణ (గాత్రం) 4-30 మద్రాసు (ఎ) వలె 6 సాయంసంగీతం(రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం 7 తెలుగున వార్తలు 7-30 పంచవర్ణ ప్రణాళిక (ప్రసంగం) 7-45 మద్రాసు (ఎ) వలె, 9-15 కొండల్ పాయ్ (నాటిక) తమిళం, 9-30 టి. అచ్యుతరామన్ (గాత్రం).

**హైదరాబాదు**

ఉ॥ 7 తెలుగున వా॥, 7-15 రామకృష్ణంకో: భజన్, 7-30 కర్నాటక సంగీతం, 7-45 పన్నాలాల్ ఘోష్: బన్సూరీ షెహనాయి, 8 ఆంగ్లమున వా॥, 8-15 హిందీలో వా॥, 8-30 రాముకృష్ణ కథా గీత్, 8-45 కర్నాటక సంగీతం, 9 అనీస్ బీబీ: భజన్.

మ॥ 12-30 రాగ్ రాగిణి, 12-50 ఉర్దూలో వా॥, 1 కె. యల్. సైగాల్, 1-10 వేణువు (రి), 1-20 జానపద పాటలు (రి), 1-30 వీణ (రి), 1-40 ఎం. కృష్ణకుమారి (రి), 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 మరాఠీలో కార్యక్రమం, 6 అనీస్ బీబీ: భజన్, 6-10 స్థానిక ప్రకటనలు, 6-15 అనౌన్సరు గారి... శ్రోతల ఉత్తరాలు, 9-15 శాస్త్రీయ సంగీతం.

# హిందీ వ్యాపకంపట్ల ప్రభుత్వ వైఖరి

### ప్రచారకుల విమర్శ

గుంటూరు, మార్చి 20: 20వ ఆంధ్రరాష్ట్ర హిందీ మహాసభా మండలి ఆవరణలో హిందీ ప్రచారకులగోష్ఠి మొన్న ఉదయం జరిగింది. ఆంధ్రదేశం నలుమూలలనుండి వచ్చిన ప్రచారకులనేకులు యీ గోష్ఠిలో పాల్గొన్నారు. శ్రీ మోటూరి సత్యనారాయణగారు యీ సభకు అధ్యక్షతవహించారు. పలువురు సభ్యులు హిందీకి యిప్పటి ప్రభుత్వ విద్యావిధానక్రమంలో తగు గౌరవస్థానం లేకపోవున్నదని, అందరి ఉపాధ్యాయుల జీతవుస్కేళ్లు చాల నిరుత్సాహంగా మున్నవని తమ నిస్పృహను వెలిబుచ్చారు. శ్రీ సత్యనారాయణగారు యీ విషయములపై తమ శ్రద్ధ చూపి హిందీవిద్యకు హిందీ ఉపాధ్యాయులకు గౌరవస్థానం లభింపచేయుటకు కృషి చేయవలయునని సూచనచేశారు.

పలువురు వెలిబుచ్చిన అభిప్రాయాలను శ్రీ సత్యనారాయణగారు సావధానంగావిని వారికి తగిన సలహానిచ్చారు. గత 35 సంవత్సరములుగా ఆంధ్రరాష్ట్రములో హిందీ ప్రచారకరంగంలో జరిగినకృషి వివరించి, తక్కిన యితర రంగములలోవలెనే ఆంధ్రులు హిందీ విషయంలోకూడ విశేషంగా కృషిచేసి అత్యంత ప్రతిభ నార్జించుచున్నారు అన్నారు. అరవదేశంలో హిందీ వుద్యమమునకు జరుగుతున్న ప్రతిఘటనను వివరించి, అరవలు తెలివిగలవారు కాబట్టి, లౌకదృష్ట్యా వారు హిందీని పాకల్యంగా నేర్చుకొని ప్రవీణులగువరకు హిందీ యింగ్లీషుస్థానం ఆక్రమించకుండా చేయుటకు ఆందోళనచేయుదురు, ఎప్పుడో అప్పుడు, హిందీ రాజభాష కాబట్టి, యింగ్లీషుస్థానం హిందీ ఆక్రమించ కలదనే నమ్మకంతోనే,వారు హిందీని శ్రద్ధగా అభ్యసిస్తున్నారనియు కాబట్టి వారు హిందీయెడ అలసత్వం, విరాదరణ చూపుతున్నారని అనుకోటం పుత్త భ్రమఅని నిరూపించి, ప్రభుత్వంమాత్రం అలసత్వం చూపుతున్నదనియు, అందువల్ల హిందీప్రచారకులు ప్రజలలో అత్యంత ప్రభోదం గావించి ప్రభుత్వమువీద విపరీతమైన వొత్తిడి తీసుకొని వచ్చుటకు ఒక బ్రహ్మాండమైన వుద్యమం తీసుకొని వచ్చుటకు కృషి చేయాలని వుద్బోధించారు.

శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారుకూడ పాల్గొని, ప్రభుత్వమును కదిలించేటట్లు మనమంతా కృషి చేయాలని ప్రభోధించారు. (స్వ. వి.)

# రామచంద్రపురం కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతం పరిశీలన

రామచంద్రపురం, మార్చి 21:- మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశ సపరివారంగా ఉదయం 8 గం॥లకు రాజమండ్రినుంచి కారులో బయలుదేరి ఆలమూరు వచ్చారు. త్రోవలో వేమగిరి, కడియం, వర్ధీపూడి గ్రామస్థులు స్వాగతమిచ్చారు. గవర్నరుగారు కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాన్ని సందర్శించారు. వరసింహదేవర సత్యనారాయణ ఎం. ఎల్. సి. కమ్యూనిటీ ప్రాజెక్టు ఆఫీసరు మాగంటి బాపినీడు, బిక్కిన వెంకటరత్నంగారలు గవర్నరుగారికి స్వాగతపత్రాలు సమర్పించారు. ఆలమూరులో ఆ గ్రామ పంచాయితీబోర్డు అధ్యక్షుడు ఉప్పర్ల లక్ష్మీనారాయణగారు, గ్రామ సహకార బ్యాంకువారు, చేనేత సంఘం వారు స్వాగతపత్రాలు సమర్పించారు. పంచాయతి బోర్డువారు, తమ సన్మానపత్రంలో పంచాయతీబోర్డుకు స్వపరిపాలనాధికారము కావాలని, భూమిశిస్తులోనూ, ఆదాయంపన్ను, అమ్మకంపన్నులలో వాటా హెచ్చించి, పంచాయితీ బోర్డుల ఆదాయములను పెంచాలని, ఆలమూరువద్ద గోదావరి రోడ్డు బ్రిడ్జి నిర్మాణానికి 1948లో శంకుస్థాపన చేశారు. కాని కట్టడం జరుగలేదు' 10 లక్షల రూ॥ల వస్తుసామాగ్రి వృథాగా పడివున్నదని యీ బ్రిడ్జి నిర్మాణం విషయంలో తోడ్పడాలని విన్నవించారు. ఆలమూరు గ్రామానికి విద్యుచ్ఛక్తికూడ సరఫరా చేయించాలని కోరారు.

గవర్నరు శ్రీ శ్రీ ప్రకాశగారు స్వాగతపత్రానికి సమాధానం చెబుతూ ప్రజలు సహకారం యొక్క విలువను గ్రహించాలని చెప్పారు. మంచితో సహాకరించి, చెడుతోలికి పోవద్దని మృదుత్వమును మనకు బోధించారు. ప్రజల దృష్టి పట్టణాలనుంచి, పల్లెలవైపునకు మరల్చి నిర్మాణ కార్యక్రమాచరణకు ప్రాముఖ్యమివ్వటం అవసరం" అని అన్నారు. సహకారోద్యమంలోనూ, నిర్మాణ కార్యక్రమంలోనూ వరసింహదేవర సత్యనారాయణగారి ఉత్సాహమును, గవర్నరు ప్రశంసించారు. సహకారం వల్ల ఎంతెంతటి ఘనకార్యాలు సాధించవచ్చునో, సత్యనారాయణగారు, ఆచరణలో మాపెట్టారని గవర్నరు అన్నారు.

పంచాయతీ బోర్డువారి స్వాగతపత్రానికి సమాధానం చెబుతూ మీరు స్వపరిపాలనను కోరుతున్నారు మరావశ్యం. గ్రామస్థులుకూడా, భారతప్రభుత్వంలో భాగమేనని వారి బాధ్యతలలో విస్మరించకుండ పడకుండ సహకారంలో గ్రామ వాస్తవ్యులందరి కృషిచేయవలెను అవసరం,అని గవర్నరు అన్నారు.



తాడేపల్లిగూడెం తాలూకా చినతిమ్మాపురం (ఫతేపురం) పంచాయతిబోర్డుకు ఉపాధ్యక్షురాలుగా ఎన్నికైన హరిజన స్త్రీ శ్రీమతి కూడంపూడి పెద్దింటమ్మ.

# రాష్ట్రవార్తలు

### వుప్లేటిపత్రు

మాధ్యమిక పాఠశాల విజ్ఞాన వ్యాయామసమితుల నాలుగవ వార్షికోత్సవం 2వ తేదీన శ్రీ పెద్దాన రాను చంద్రరావుగారి అధ్యక్షతన జరిగినది. శ్రీ బి. వి. నరసింహారావుగారు బాల సాహిత్యం గురించి ఉపన్యసిస్తూ కొన్ని అభినయాలు ప్రదర్శించిరి. విద్యార్థులు తెలుగు, సంస్కృత పద్య గద్యములు పఠించారు.

ప్రధానోపాధ్యాయులు విద్యార్థుల సమస్యలపై వుపన్యసించారు. వివిధ పోటీలలో గెలుపొందినవారికి శ్రీ నూరి శెట్టి వెంకటస్వామినాయుడు గారు బహుమతులు యిచ్చారు.

### కొత్తపేట

తాలూకా మాజీగీతపనివారల తాటి బెల్లం సహకారసంఘాల యూనియన్ మహాజనసభ 11వ తేదీన శ్రీ బెల్లుబోయిన సత్యనారాయణగారి అధ్యక్షతన జరిగినది. ప్రతిసొసైటీవారు తయారు చేయు బెల్లమునకు పరీయగుకేటు నిర్ణయించాలని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించారు. నీరా తయారు అనుమతిపొందుటకు 6 గురు సభ్యులతో ఒక ఉపసంఘం నియమించారు.

### చందర్లపాడు

శ్రీ వాసిరెడ్డి కోటయ్య మెమోరియల్ బోర్డుహైస్కూలు తృతీయ వార్షికోత్సవం శ్రీ యార్లగడ్డ వాసయ్యగారి అధ్యక్షతన జరిగినది. ప్రధానోపాధ్యాయులు నివేదిక చదివారు. శ్రీ పి. రామకోటయ్య, సూర్యదేవర అన్నపూర్ణమ్మ, కోలాచల గోపాల కృష్ణమూర్తిగార్లు వుపన్యసించారు. పిదప వినోద నాటకప్రదర్శనలు జరిగినవి. వివిధపోటీలలోను నెగ్గినవిద్యార్థులకు శ్రీ కాకాని వెంకటరత్నంగారు బహుమతులప్రదానం జేశారు.

### చిత్తూరు

కస్తూరిబాయి మున్సిపల్ బాలికోన్నతి పాఠశాల వార్షికోత్సవం 14వ తేదీన శ్రీమతి సుబ్బులక్ష్మి వెంకట్రామన్ గారి అధ్యక్షతన జరిగినది. ప్రధానోపాధ్యాయిని శ్రీమతి కల్యాణీ దేవిగారు నివేదిక చదివారు. పురపాలక సంఘ అధ్యక్షురాలు శ్రీమతి రత్నాబాయమ్మగారు బహుమతులు పంచిపెట్టారు. బాలికల నృత్యప్రదర్శన జరిగింది.

### యాడికి

అనంతపురం జిల్లాబోర్డు హైస్కూళ్ల ప్రధానోపాధ్యాయుల సంఘ కార్యవర్గ సమావేశం 5వ తేదీన శ్రీ జి. నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగినది. విద్యార్థుల సమస్యలపై శ్రీమాచ్ ఎస్. వి. రమణగారు ఉపన్యసించారు. శ్రీ టి. భీమసేనరావు, కె. వెంకటశేషయ్య గారు విద్యార్థులు క్రమశిక్షణ నలవర్చుకోవాలని వుద్బోధించారు. అధ్యక్షుని అంత్యోపన్యాసంతో సభ ముగిసింది.

### సర్వాపురం

ప్రఖ్యాత చిత్రకారులు, అంతర్జాతీయ ఖ్యాతినొందిన ఫోటోగ్రఫీ విశారదులు శ్రీ అంకాల సుబ్బారావు గారికి "ఆంధ్రవాణి" పత్రికా నిర్వాహకులచే పత్రికా కార్యాలయమునందు 11వ తేదీన సన్మానము జరిగినది.సభకు పెనుగొండ వాస్తవ్యులు, శ్రీ జవ్వాది లక్ష్మయ్యనాయుడుగారు అధ్యక్షతవహించారు. కార్యాలయ నిర్వాహకులు సుబ్బారావుగారికి నూతన వస్త్రములనిచ్చి సత్కరించారు. సుబ్బారావుగారు చిత్రకళనుగూర్చి వివరిస్తూ తాను ఏ విధముగా కృషి చేసినదీ తెలియచేశారు. పలువురు వారి చిత్రకళా నైపుణ్యాలనుగూర్చి ప్రశంసించిన అనంతరం అధ్యక్షుని వందనములతో సభ ముగిసినది. (స్వ. వి.)

### విజయవాడ

ఈనెల 7వ తేదీన దౌలీపార్కులో శ్రీ లక్కరాజు రాఘవరావుగారి అధ్యక్షతను విజయవాడ కట్టెల వర్తకుల సంఘసభ్యులు సమావేశమై సంఘ కార్యవర్గమునకు శ్రీ జగడం చలమయ్యగారిని అధ్యక్షులుగా, శ్రీ నై. నరసింహారావుగారిని కార్యదర్శిగా, శ్రీ వాండ్రా శి. పోతన్నగారిని సహాయ కార్యదర్శిగా ఎన్నుకున్నారు. శ్రీ సిఖ్యా వెంకటరత్నకవిగారు సంఘాన్ని సొసైటీల ఆక్టుక్రింద రిజిష్టరు చేయించవలసినదిగా సలహా నిచ్చారు.

### గుడివాడ

ఈతాలూకా సీనియర్ ఇన్‌స్పెక్టరు పెంచయ్యగారిని యిక్కడినుంచి బదిలీ చేసినందున, వారికి వీడ్కోలిచ్చుటకు వారిస్థానే వచ్చిన వి. జగన్నాథరావు గారికి స్వాగతమిచ్చుటకు 7వ తేది సాయంకాలం ఇ ఎఫ్. జియం స్కూలులో ఆల్పాహారవిందు యేర్పాటు చేయబడింది. ఆ సందర్భంలో జరిగిన సభలో శ్రీరామారావుగారు, పెంచయ్య, జగన్నాథరావు గారల గుణగణాలను శక్తిసామర్థ్యాలను ప్రశంసిస్తూ మాటలాడారు.

### గన్నవరం

పురప్రముఖులు శ్రీ చెరుకూరి వెంకట కృష్ణయ్యగారి అధ్యక్షతన, సమావేశమై యీ దిగువ సభ్యులతో అభ్యుదయ సమితి స్థాపించారు. శ్రీ శ్రీకంఠం కృష్ణరావు, డి. లక్ష్మీనరసయ్య, మను బోలు రంగారెడ్డి, చెరుకూరి వెంకట కృష్ణయ్య, ముదివర్తి కొండమాచార్యులు, పొన్నలూరు కోటారెడ్డిగార్లు. సమితి ఆశయాలు వివరిస్తూ పలువురు ప్రసంగించారు.

### రాజమండ్రి

ప్రభుత్వ దేవేంద్ర శిక్షణ పాఠశాల వార్షికోత్సవం శ్రీ ఎం. ఎ. సోమయాజులుగారి అధ్యక్షతన 8వ తేదీన జరిగినది. ఉదయం పతాకవందనం ఆటలపోటీలు జరిగినవి. సాయంత్రం బహిరంగసభ జరిగినది. ప్రధానోపాధ్యాయులు నివేదిక చదివారు. పలువురు విద్యార్థులు, వుపాధ్యాయులు, వుపన్యసించిన పిదప నృత్య, వినోద ప్రదర్శనాలు జరిగినవి.

### కాకినాడ

స్థానిక దివ్యజ్ఞానసమాజ భవనంలో ఇంగ్లండు దివ్యజ్ఞాన సమాజ మాజీ కార్యదర్శి శ్రీ జాన్‌కోట్స్‌గారు 7వ తేదీన పరిపూర్ణ తత్వంగురించి ప్రసంగించారు. పాశ్చాత్య సన్యాసులు అనుసరణీయమని, కళా సౌందర్యాన్ని బట్టి భారతీయ వస్త్రధారణ పద్ధతియే మాకు నచ్చుచున్నదని అన్నారు. తెంపరలో జా ప్రసంగిస్తూ ప్రస్తుతం పెంపవిస్తున్న మూర్ఖత్వం, అవిద్యలను పారద్రోలటానికి సహావభావంతో ప్రజలు ఐక్యకృషి సల్పాలనే, జాతిమతి విభేదాలు లేకుండా సౌభ్రాతృత్వం అలవర్చుకోవాలని వుద్బోధించారు.

### పాలకొల్లు

ప్రజా సోషలిస్టుపార్టీ బహిరంగసభ 7వ తేదీన శ్రీ చండిక అప్పలస్వామి గారి అధ్యక్షతన జరిగింది. శ్రీ ఈరంకి నారాయణమూర్తి గారు ప్రసంగిస్తూ, ఆంధ్రరాజధాని విషయంలో తెలుగు నాయకులు, కమ్యూనిస్టులు అవలంబిస్తున్న వైఖరిని తీవ్రంగా విమర్శించారు.

అధ్యక్షులు మాట్లాడుతూ ప్రస్తుత పరిస్థితిలో ఆంధ్రులందరు ఐక్యంగా నిలబడాలని కోరారు. అనంతరం జనతాదళం వారు అద్భుతలీల శ్రీ పొట్టి శ్రీరాములు జీవిత చరిత్ర బుర్రకథ చెప్పారు.

# భీమవరంలో కుష్ఠునివారణ కేంద్రం

### ప్రభుత్వంచే 5 వేల రూ. ల మంజూరు

భీమవరం, మార్చి 19: ఈ పట్టణం రామకృష్ణ ప్రకృతిచికిత్సాలయంవారి ఆధ్వర్యాన కుష్ఠువ్యాధి నివారణకొలనీ నిర్మించుటకు మద్రాసు ప్రభుత్వం 5 వేల రూ॥ లను మంజూరుచేసినట్లు తెలియవచ్చినది. 10 వేల రూ॥ల ఖర్చులో 8 చిన్నయిళ్లను నిర్మించవలసియున్నది. శ్రీ దీనదయాళ్ రామ్ ఎం. ఎల్. ఎ. (బీహారు) శ్రీమతి దేవికపూర్ (కలకత్తా) శ్రీమతి పెదిరాజు అన్నపూర్ణమ్మ, వేగేశన నానకమ్మ గారలచే మంగళవారంనాడు నాలుగు యిళ్లకు శంకుస్థాపన చేయబడింది. జిల్లాలో ఇన్ఫెక్షన్ స్త్రీపురుషులయని, ప. గోదావరిజిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేస్తారని తెలుస్తున్నది.

### హైదరాబాదు శాసనసభలో 'బ్రహ్మాండమైన' ప్రసంగం

హైదరాబాదు, మార్చి 22: "శాసనసభ ఏర్పడిన ఒక యేడాదికి ఈ వేళ నేను అనర్గళంగా వుపన్యసించనున్నాను. కనుక నాకింకొక ఎక్కువవ్యవధి ఇవ్వాలి" అని స్వతంత్ర హరిజన సభ్యుడు ఈ వేళ శాసనసభలో అనగానే సభ్యులందరు గొల్లున నవ్వారు. ఆయనకు ఇవ్వబడిన వ్యవధి అయిపోయిందంటూ స్పీకరు ఒక చెంపగంట మోయిస్తుండగా శ్రీ గణపతిరావు వాఘమారే యీ విధంగా అన్నారు. మరొక హరిజన స్వతంత్ర శాసనసభ్యుడు శ్రీమాధవరావు వవాయ్ కూడా అదేవిధంగా అన్నారు. (స్వ. వి.)

### తెనాలి

ప్రజా సోషలిస్టుపార్టీ అధ్వర్యాన యీనెల 15వ తేదీన శ్రీ నన్నపనేని వెంకట్రావు చౌదరిగారి అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. బెజవాడ మున్సిపల్ చెయిర్మను శ్రీ టి.వి.యస్. చలపతిరావు గారు ప్రజాపార్టీ ఆశయాలు వివరించారు. మద్రాసు విషయమై రాజాజీవైఖరిని విమర్శిస్తూ, ఆంధ్రులు మద్రాసుపై హక్కులు వదులుకోరాదని ప్రజలందరూ ఆంధ్రకేసరి నాయకత్వాన్ని బలపరచాలనీ కోరారు. పిదప ఆంధ్రమంత్రులు రాజీనామా నివ్వాలని సభలో తీర్మానించారు.

### గురజాల

శ్రీ యస్. వి. గురవులుగారి అధ్యక్షతన 9వ తేదీన బహిరంగసభ జరిగినది. శ్రీ ఏనుముల వెంకటేశ్వర్లుగారు నేటి రాజకీయ పరిస్థితులను వివరిస్తూ సుస్థిర శాంతిస్థాపన ఆవశ్యకతను గురించి ప్రసంగించారు. నందికొండప్రాజెక్టు కమిటీ కార్యదర్శి శ్రీ సుబ్రహ్మణ్యం, ఉపాధ్యక్షులు శ్రీ వట్టికొండ రామయ్య చౌదరిగార్లు నందికొండవలన మన్య ఆంధ్రజిల్లాలకు చేకూరగల ప్రయోజనాలు వివరించారు.

### ధర్మవరం

బోర్డు హైస్కూలు ఆంధ్ర సారస్వత సంఘ వార్షికోత్సవం శ్రీ జేవుల పల్లి కృష్ణశాస్త్రిగారి అధ్యక్షతన 1వ తేదీన జరిగినది. శ్రీ పుట్టపర్తి రామాచార్యులుగారు పతాకోత్సవం జరిపారు. అధ్యక్షులు తిక్కనభారతం విశిష్టతను గురించి ప్రసంగించారు. రాత్రి ఉపాధ్యాయులు యస్. జి వో. నాటకం ప్రదర్శించారు.

వివిధ పోటీలలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులు పంచిపెట్టారు.

### మంగళగిరి

స్థానిక డిప్యూటీ తహశీలుదారు శ్రీ వి. వి. రాఘవయ్యగారు గుంటూరు బదిలీ కాబడి వారి స్థానే శ్రీ మేళ్ల చెరువు సుబ్బారావుగారు నియమించబడినారు. ఈ సందర్భంలో వుద్యోగులకు హైస్కూలువారు అల్పాహారవిందు చేశారు.

### జెన్నంపల్లి

యువజన సంఘంవారి అధ్వర్యాన స్టాలిన్ మృతికి సంతాప సూచకంగా బహిరంగసభ జరిగింది. శ్రీ గోవిందప్ప కృష్ణాచారిగార్లు స్టాలిన్ చరిత్రను వివరించారు.

### మార్కాపురం

మద్రాసు ప్రభుత్వ ఉపాధ్యాయుల సహాయక నిధి కమిటీ తాలూకాశాఖ ఎన్నిక 16వ తేదీన తహశీలుదారు శ్రీ యస్. చిదంబరయ్యగారి అధ్యక్షతన జరిగినది. స్పెషల్ డిప్యూటీ కలెక్టరు శ్రీ ఎం. వెంకటేశ్వరరావుగారిని అధ్యక్షులుగను, ఓ. విశ్వనాథరావుగారిని ఉపాధ్యక్షులుగను, బి. వి. రమణయ్య, పి. వి. చిన్నయ్యగార్లను కార్యదర్శులుగను, ఓ. రామిరెడ్డిగారిని కోశాధికారిగను ఎన్నుకున్నారు.

### బిక్కవోలు

శ్రీ సీతారామ నామసంకీర్తన సంఘ ఆధ్వర్యమున ద్వితీయ వార్షికోత్సవములు 1 నుండి మూడు రోజులు జరిగినవి. మొదటిరోజున వస్త్రములు, ధాన్యములు 108 శేరులు నుండి బియ్యంపెట్టి పూజలు జరిపిరి. మూడవ రోజు శ్రీ సూరిపాక సీతారామశాస్త్రి గారిచే సీతాకళ్యాణము జరుపబడినది. శ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులు, జటావల్లభుల పురుషోత్తంగార్లు ప్రసన్యసించారు. హరికథా కాలక్షేపములు, సంగీతకచేరీలు జరిగినవి.

# హైకోర్టు విషయంలో కేంద్ర నిర్ణయం ఆంధ్రులకు అనర్థదాయకం

### —నెహ్రూకు న్యాయవాదుల తంతి

మద్రాసు, మార్చి 21: "తాత్కాలిక రాజధాని మద్రాసులో లేకుండానే ఆంధ్ర హైకోర్టు మాత్రం మద్రాసులో మరికొంతకాలం ఉండవలెనని కేంద్ర మంత్రివర్గం నిర్ణయంచేసి వచ్చిన వార్తలపై ఆంధ్ర న్యాయవాదులు చాలా ఆందోళన చెందుతున్నారు. తమిళనాయకులు మూర్ఖంగా అయుక్తంగా, అన్యాయంగా, ఆంధ్రులయెడ ప్రకటించుచున్న విద్వేషభావమును పురస్కరించుకొని తాత్కాలిక రాజధానీ నగరమును గురించి వాంఛూ నివేదికలో చేయబడిన సిఫార్సునుగూడా కేంద్రప్రభుత్వము త్రోసిపుచ్చుచున్నందున మరింత ఆందోళన చెందుచున్నాము" అని మద్రాసు హైకోర్టు ఆంధ్ర న్యాయవాదులు 35 మంది భారత ప్రధానమంత్రి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూకు ఒక తంతిని పంపించారు. వారి తంతిలో ఇంకా ఇల్లాఉంది. ప్రస్తుత మద్రాసు హైకోర్టులకు కోర్టు ఫీజు యూ పేణ లభించుచున్న మొత్తం ఆదాయంలో అత్యధిక భాగము ఆంధ్ర ప్రాంతము నుండియే లభించుచున్నది.కనుక కేంద్ర ప్రభుత్వ నిర్ణయము ఆర్థికంగా ఆంధ్రులకు అనర్థదాయకమైనది. కోర్టుపని మీద మద్రాసువచ్చేడి ఆంధ్రులు మద్రాసులో కొనేటటువంటి వస్తుసామగ్రుల వల్ల వచ్చేఅమ్మకాలపన్ను ఆంధ్రరాష్ట్రమునకు చెందదు. ఆంధ్రరాష్ట్రం యొక్క కొత్తరాజధాని అభివృద్ధికి ఈ నిర్ణయము ప్రతిబంధకము. ఆంధ్రరాష్ట్రమునకు కలిగెడి ఆర్థికోపద్రవమును, కష్టమును నివారించ గోరుచున్నాము. ప్రస్తుత మద్రాసు హైకోర్టు వారే ఆంధ్ర ప్రాంతంలో విచారణాధికారం చలాయించే ఎడల కలిగే ప్రతికూలఫలితములు విపరీతంగా ఉండగలవు."

కె. ఎస్. సోమశేఖరరావు, కె. రామనాథం, కె. రాజారావు, ఎం. బి. రామశర్మ, వై. సూర్యనారాయణ, ఎ. ఎస్. ప్రకాశం, ఎం. కామరాజు, కంచిభట్ల కృష్ణమూర్తి, వింజమూరి రంగాచారి, సుపర్ల సూర్యప్రకాశం, పి. ఎస్. ఎన్ రామచంద్రరావు, కె. రాఘవాచారి, జి. గోవిందరావు, ఎ. సాంబశివరావు, ఎస్. సి. వెంకటపతిరాజు, ఎ. రాఘవయ్య, డి. చిన్నప్పరెడ్డి, సి. రామకృష్ణ, ఆర్. వెంకటరామారావు, సూర్యనారాయణరాజు, ఎస్. రాజేశ్వరరావు, డి. రామచంద్రరావు, కె. సుందరరాజన్, అల్లె సూర్యనారాయణరావు, ఎ. వి. పాపయ్యశాస్త్రి, ఎం. సీతారామారావు ప్రభృతులు ఆ తంతిపై సంతకాలు చేశారు.

ఈతంతి ప్రతులను భారత రిపబ్లిక్ అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షులకుగూడా పంపించారు.

...గీతములలో మరికొన్ని గేయములను పాడారు. ఈసంస్థచేసెడి నాభివృద్ధియకు గాక గవర్నరుగారు ఆశీర్వదించారు.

తరువాత గవర్నరుగారు వారి బృందము సిబ్బందితో సహా గుంటూరు వైద్య కళాశాలను సందర్శించారు. అచ్చట విద్యార్థి సంఘ కార్యదర్శి యస్. అంజనేయులు, అర్చనాహింద్ర సింగ, శ్రీమతి సౌరమ్మగారలు గవర్నరుగారికి పుష్పమాలలు సమర్పించారు. కళాశాల ప్రిన్సిపాలు శ్రీమతి డా॥ ఖారా జె. సౌరిగారు గవర్నరుగారికి కళాశాల అధ్యాపకులను పరిచయం చేసి కళాశాలలోని వివిధ శాఖలను చూపి అచ్చట జరుగు కృషిని వివరిస్తూ ఇచ్చట విషయములను నేర్చుకొనుటలో, వారికున్న సందేహముల తీర్చుకొనుటలో గవర్నరుగారు అత్యంత ఆశక్తి ప్రదర్శించారు.

అచ్చటనుండి గవర్నరుగారు అంజుమాన్ ఇస్లామియా భవనమునకు వెళ్లారు. హౌవుదారి సోడవున జనులు బారులు దీర్చి గవర్నరుగారి దర్శనమునకు గం, టలకొలది వేచియున్నారు. అంజుమాన్ ఇస్లామియాలో సమావేశమైన ముస్లింసోదరులసభలో హిందీస్తానీలో ప్రసంగించారు. రాత్రి ఆఫీసర్సు క్లబ్బులో విందులో పాల్గొని అచ్చటనుండి రాత్రి 10 గంటలకు తమ సెలూనులో తెనాలిబండిలో తెనాలి వెళ్ళారు.

# ఉద్యోగుల మార్చిజీతాలు ఇండియా నాణాలలో ఇవ్వడానికి ప్రభుత్వనిర్ణయం

హైదరాబాదు, మార్చి 21: ప్రభుత్వోద్యోగుల జీతాలు ఏప్రిలు నెల నుంచి ఇండియా నాణాలలో ఇవ్వడానికి ప్రభుత్వం లోగడనిశ్చయించింది. కాని ఇప్పుడు మార్చినెలనుంచే ఇండియా నాణాలలో ఉద్యోగులకు జీతాలివ్వాలని సంస్థానప్రభుత్వం నిర్ణయించింది. ఇండియా కరెన్సీలోనే ఆయా శాఖలలోని వుద్యోగుల జీతాల జాబితాలు తయారుచేయమని ప్రభుత్వం ఉత్తరువులిచ్చింది. (స్వ. వి.)

# గుంటూరులో ఏనాది బాలబాలికల హాస్టళ్లు

### గవర్నరు సందర్శనం

(స్వకీయ విలేఖరి)

గుంటూరు, మార్చి 20: మద్రాసు గవర్నరు శ్రీ ప్రకాశగారు నిన్న మధ్యాహ్నం 4 గంటలకు బయలుదేరి ఏనాది బాలబాలికల హాస్టళ్లను సందర్శించారు. హాస్టలు కార్యదర్శి శ్రీ వల్లమూడి గోపాలకృష్ణమూర్తిగారుగవర్నరుగారికిస్వాగతమొసంగారు.విద్యార్థులు గవర్నరుకు పూలమాలలు వేశారు.

ప్రథమంలో బాలుర హాస్టలులో గవర్నరుగారు యీ బాలుర విషయం ప్రశ్నించి తెలుసుకున్నారు. ఏనాదివారుముఖ్యంగాఆంధ్రదేశములో అన్ని ప్రాంతములలోను తిరుగు చుంటారనియు, కర్నూలుజిల్లా నిరికి కేంద్రమనియు వీరిలో అంతేవు ఖ లేమియు లేవనియు తెలిపి థక్కరు బాబాగారు యీ సంఘము నేర్పాటు చేయుట కెంతో చేయూత నిచ్చారన్నారు. ఇప్పటి బాలుర సంఖ్య 82 మంది అనియు, వీరు ముఖ్యంగా హైస్కూలులో చదువుకొను విద్యార్థులనియు, యిచ్చటనే వారలకు భోజనవసతులు ఏర్పాటు చేయబడుచున్నవని శ్రీగోపాలకృష్ణమూర్తిగారు తెలిపారు.

శ్రీ గుంటూరు శిల్ప పారిశ్రామిక సహకార సంఘ నిర్వాహకులు గవర్నరుగారికి వారి శిల్పకళా నైపుణ్యమును ప్రదర్శించు నిమిత్తం సిమెంటులో తయారు చేసిన అరలంగుళం ఎత్తుగల వినుకు విగ్రహమును బహూకరించారు. గవర్నరుగారు సంతోషించి వీరి శిల్పకళా ప్రతిభను మెచ్చుకొను చెలిబుచ్చారు. గవర్నరుగారికి వీరొక మనురాండం కూడ సమర్పించారు.

అనంతరం గవర్నరుగారు బాలికల హాస్టలు దర్శించారు. ఇచ్చట 30 మంది బాలికలున్నారనియు, వారందరు విద్యాభ్యాసమునే చేయుచున్నారనియు శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు గవర్నరుగారికి తెలిపారు. బాలికలు పాడిన...

# గుంతకల్లు నీటి కొళాయిల స్కీము

### మంత్రికి విజ్ఞప్తి

మద్రాసు, మార్చి 20: శ్రీ వందా నారాయణప్ప, (యం. యల్. ఎ), జనాబ్ దావూద్ సాహెబ్ (ఛెర్మన్, గుంతకల్లు మున్సిపాలిటీ) శ్రీ డాక్టరు హనిమేశరావు, శ్రీ కె. శాంతప్ప(యం. యల్. ఎ) గుంతకల్లు మునిసిపాలిటీ కమిషనరు గారలు నిన్న శ్రీ ఎ. బి. శెట్టిగారిని దర్శించి, గుంతకల్లు నీటి కొళాయిల స్కీము మంజూరయి, మొదటి భాగము పూర్తి చేయబడినదనీ, రెండవ భాగమునకు సంబంధించిన ప్లానులు, ఎస్టిమేట్లు యింజనీయరు శాఖ వారిద్వారా ప్రభుత్వమునకు పంపబడినవనియు, ప్రభుత్వం వారు వెంటనే వాటినిమంజూరుచేసి, రెండవ భాగము పనిని ప్రారంభించుటకు వుత్తరువు పంపవలసినదిగాను, వేసవికాలం గనుక త్రాగుడు నీటి యిబ్బందివల్ల ప్రజలు పడుచున్న బాధలు చాల దుర్భరముగా నున్నవనీ మనవి చేశారు. మంత్రిగారు సావధానముగా విని తగు సహాయం చేస్తామన్నారు.

# వృత్తి కళాశాలలు

### సాధ్యమైనంత త్వరలో సెలెక్షన్లు జరపటానికి ఏర్పాట్లు

మదరాసు, మార్చి 20: ఈనాడు వృత్తి కళాశాలలో విద్యార్థులను చేర్చుకొనే సంగతి గూర్చి ఆలోచించే కమిటీలను కొంత ముందుగానే నియమించి సాధ్యమైనంత త్వరలో సెలెక్షనులను పూర్తి చేయటానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేయతలంచియున్నదని విద్యామంత్రి డా॥ ఎం. వి. కృష్ణారావుగారు కౌన్సిలులో శ్రీ టి. పురుషోత్తం మొదల్యారుగారి ప్రశ్నకు సమాధానంగా తెలియజేశారు.

### యస్. యస్. యల్. సి. లో చిత్రరచన కోర్సు

యస్. యస్. యల్. సి కి చిత్రరచన కోర్సును నిర్బంధంగా ప్రవేశపెట్టే ఆలోచన ప్రభుత్వానికి యేమీ లేదని గత రెండేండ్లుగా డ్రాయింగు చిత్ర రచన పఠనీయ అంశాలలో మాత్రం చేర్చబడి యున్నదని విద్యామంత్రి డా॥ ఎం. వి. కృష్ణరావుగారు ఒక ప్రశ్నకు సమాధానంగా తెలిపారు. చిత్రరచన పఠనీయవిషయముగా తీసుకొన్న బాలురకు యూనివర్సిటీ తరగతులలో చేరడంలో యే విధమైన కష్టంలేదని కూడా వారు చెప్పారు.

